# శ్రీ వివేకానందసందేశము:

[మా రా॥ పురపు వివేకానందసమాజమువారిచే
1929 లో శ్రీస్వామివారి జన్మదినోత్సవమున
చదువఁబడినది.]



కర్త:

శ్రీ కూచి నరసింహముపంతులుగారు, బి. ఏ.

Vyasa Kuteeram, Melupaka-Yellamanchili-[Dt. Vizag.]

# ఆంధ్ర సేవా ప్రసూనములు.

:(o):

సౌజన్యోత్తేజకమును, సౌశీల్యనిర్మాణదక్షమును, అగు ఈగ్రంథములు తోడిమానవులఁ బ్రేమించి సేవించు స్వహిత పరాఙ్ముఖత్వప్రవృత్తిఁ గలిగించి, చక్కనివ్యక్తిప్రకృతియొక్కయు జాతిప్రకృతియొక్కయు నిర్మితి గావించుట యందెంతయు తోడ్పడఁగలవు. ఆత్మోపకార పరోపకార కరమగు మంచినడవడితో మునుగడ సాగించుకొనుపద్ధతిఁ గనుఁగొనుటకు మన దేశములోని తరుణవయస్కులగు ఈతరమువారి కివి కడుసాహాయ్యకారులు. ఈపుస్తకములు పఠితలను సుశిక్షలోఁ బెట్టి, వారికి బహువిధములైన లాభములు చేకూర్చుట కుద్దేశింపఁబడినవి.

మానవాభ్యుదయమునకు తోడ్పడు ఈమనోహరవాఙ్మయము అక్షరాస్యులగు ప్రతి ఆంధ్రుని కరకమలమును అవశ్యముగ అలంకరింప దగియున్నది. ఆంధ్రగ్రంథాలయములకు భూషణములు.

☞ గ్రంథములపట్టిక మూఁడవకవరుపుటపై కాననగును.

# శ్రీవివేకానందసందేశము.

[శ్రీ వివేకానంద జన్మదినోత్సవసందర్భమున మార్కాపురపు సమాజమువారి కొఱకు వ్రాయఁబడిన వ్యాసము.]

త్రిలిఙ్గపత్రికనుండి పునర్ముద్రితము.

గ్రంథకర్త:
కూచి నరసింహముగారు.



చెన్నపురి:
శ్రీరామ ముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రకటింపఁబడినది.
1930.

శ్రీవివేకానందసమాజసభ్యులారా!

శ్రీస్వామివారి జన్మదినోత్సవ సమయమునఁ జదివి వినిపించుట కొక "సందేశ" మంపుఁడని యెంతోగౌరవముతో మీయధ్యక్షుఁడుగారు నాకొక యుత్తరము వ్రాసినారు. అనారోగ్యహేతువుచే వారంతకుముందు కోరినకోర్కి తీర్పఁజాలనందులకుఁ జింతిల్లుచుండఁగా నాకీ లేఖ యందినది. ఇది కూడ నేఁజేయఁజాల ననుటకు మన సొప్పనందున ఆలేఖ శ్రీస్వామివారి యాదేశముగానే భావించి నాకుఁ దోఁచిన కొన్ని మాటలు వ్రాసి పంప నిశ్చయించియున్నాను.

నేను సంస్కృతభాషాజ్ఞానముగల పండితుఁడను గాను గాని, స్వామివారి యాంగ్లోపన్యాసము లనేకములు శ్రద్ధాభక్తులతోఁ జదివినాను; గొన్ని యాంధ్రీకరించి ప్రకటించినాను. వారియెడలను వారిజ్ఞానపితయగు శ్రీరామకృష్ణపరమహంసస్వామివారియెడలను జిరకాలమునుండి నాకపారమైన గౌరవప్రపత్తులు గలవు. ఇప్పుడు నా యెనుబదిమూఁడవ యేఁటఁగూడ, ఆపావనపురుషుల నుభయులను దలఁచు సాష్టాంగవందనములతో స్మరించుకొని యానందబాష్పములు విడుచుచుందును.

దేశముకొఱకుఁ బాటుపడి పనిచేసి గతించిన మహానుభావు లంద ఉండఁగా నాకు శ్రీవివేకానందస్వామివారిపైఁ

ప్రత్యేకముగా నంతభక్తి యేల కలిగినదో యీక్రింద సం
హముగాఁ జెప్పుచున్నాను.

ఐహికాముష్మికసుఖముల రెంటను మనదేశ మిప్పు
కడుశోచనీయమైన స్థితిలో నున్నదని విద్యావంతులైన దే
భిమాను లందఱును ఒప్పుకొనుచున్నారు. రోగనిదానవి
యమున నందఱును ఏకాభిప్రాయులై యే యున్నారు గా
రోగనివారణసాధనవిషయమునమాత్ర మభిప్రాయము
భిన్నములుగా నున్నవి. లోకోపకారబుద్ధిగలవారు వారివా
యభిప్రాయముల ననుసరించి చికిత్సాపద్ధతుల నవలంబించు
న్నారు. స్వార్థత్యాగులగు నీదేశోపకర్తలను మూఁడు తె
లుగా విభజింపవచ్చును.

మొదటి తెగవారు కేవలపూర్వాచారపరాయణుల
పరిపాలనాదిపరిస్థితు లెంతగా మాఱినను ప్రాచీనధర్మశా
ముల ననుసరించియే మనము జీవయాత్ర సాగించుకొనవలెన
స్మృతికర్తలగు ఋషులు త్రికాలవేదులు. మన మవలంబిం
వలయు మార్గము లన్నియు నిదివఱకే వారు వ్రాసిపెట్టినార
అట్లు కచ్చితముగాఁ బ్రవర్తింపకుండుటవలననే మన కీయన
ములు వచ్చినవి. ఉదయాద్యాసాయము మానవుఁడు చేయ
వలయు కర్మములను గూర్చి— పంచమహాయజ్ఞములు, వర్ణా
శ్రమధర్మములు, స్నానము, మడి, భోజనము, జుట్టు, బొట్టు
కట్టు—ఇట్టివిషయము లన్నిటినిగూర్చి, పూర్వు లెట్లు వ్రా
పెట్టిరో యక్లే తూచాలుతప్పకుండ మన మాచరింపవలయును

అట్లు చేయుటవలన మన కైహికసౌఖ్యములు కొన్ని పోయినం బోవుంగాక, వానికోసము పరమార్థములైన మతధర్మములు పాడుచేసికొనంగూడదు. ఇప్పటివా రల్పబుద్ధులు. పూర్వస్మృతులు సవరించుటకు వారి కధికారము లేదు— అని వారు చెప్పుదురు. అనర్థకరములుగాం గాన్పించుచున్న కొన్ని పరంపరాగతాచారములు స్మృతివిహితములుగాకున్నను వానిని మార్చుకొన నిచ్ఛగింపరు. ఏల మార్చుకొనరు? అని యడిగిన, నవిశిష్టాచారములుగాన వానిజోలికి మనము పోంగూడదు— అని సమర్థింతురు. వీరికిం బ్రాచీనత్వమే పరమప్రమాణముగాం జూపట్టును.

ఇంక రెండవతెగవారు సంస్కరణాభిలాషులు. వారును దేశమున కుపకారము చేయు సదుద్దేశములు గలవారే, స్వార్థత్యాగులే. "బంగారమువంటి దేశము పరాధీనమై పోయినదే! పూర్వాచారములన్నియుం బూర్ణముగా నైకమత్యమును బోంగొట్టినవే? కొన్ని మహాఘోరములుగాం గూడం గన్పట్టుచున్నవే! ఏకకుటుంబముగా నుండవలయు హిందూప్రజాసంఘము శతసహస్రశాఖలుగాం జీలి, యీర్ష్యాద్వేషమూఢతాకలుషితమైయున్నదే! దేశవిజేత లంతయత్యున్నతస్థితిలోనుండి సకలైశ్వర్యములు ననుభవించుచుండంగా మనము పూర్వోత్కృష్టస్థితినుండి జారి యిట్టిష్టకష్టములు పడుచుండుటకుం గారణమేమి? విద్యావివేకనాగరకతలలోను విత్తాధికారయశస్సంపత్తిలోను హా రంత

యొక్కువగా నుండుటకును మన మింత యడుగంటిపోవుట కును హేతువేమై యుండును!" అని యాలోచించినారు. ఆలోచించి చివరకు "వారిమతజీవనసంఘజీవనపద్ధతులు మన వానికంటె మహత్తరములై యున్నవి గనుకనే వారి కుచ్ఛ్రిస్థితియును మన కిట్టి యధోగతియును సంప్రాప్తములైనవి" అని నిశ్చయించుకొన్నారు. నిశ్చయించుకొని, పాశ్చాత్యపద్ధతుల దృష్టిలోఁ బెట్టుకొని సంస్కరణకృత్యములు సాగింప దొరఁకొనినారు. స్మృతిప్రామాణ్యబుద్ధి పూర్ణముగా సడలించుకొన్నారు. కాలానుగుణముగా దేశక్షేమముకై యాచారములు మార్చుకొనక తీఱదని స్థిరపఱుచుకొన్నారు. ప్రధానమైనది నీతిగాని బాహ్యాచారములు గావని బహిరంగముగాఁ జాటి చెప్పినారు. వీరిదృష్టిని విగ్రహారాధనము, జాతిభేదములు, పూర్వజన్మసిద్ధాంతము, భోజనప్రతిభోజనవివాహాదులఁ గూర్చి పరంపరగా వచ్చుచున్న కొన్ని యాచారనియమములు కేవల మూఢవిశ్వాసజన్యములు, కనుక వర్జనీయములు.

ఈ తెగలోఁ గొంద ఱుద్దండ నీతిబలశాలులును స్వహితపరాఙ్ముఖులును దేశోద్ధరణమహాకార్య ధూర్వహులును గలరు. వారు దేశమున కొక మహోపకారము గావించినా రనుటమాత్రము నిర్వివాదాంశము. అది యేమి? కుంభకర్ణునివలె గాఢతమోనిద్రలోఁబడియున్న మన దేశీయులను గదల్చి లేపి సంపూర్ణ జాగ్రదవస్థకుఁ దెచ్చుట!

కాని యామేలుతోపాటు కొంత కీడుగూడ సంభవించినది. ఆఙ్గ్లవిద్యాసంపన్నులగు పెక్కురలో దేశీయప్రాచీనధర్మ వైముఖ్యమును విదేశీయచిత్తప్రవణతయును గలిగినవి!

ఇక శ్రీరామకృష్ణపరమహంసస్వామివారి సచ్ఛాత్రబృందమందలి శ్రీవివేకానందస్వామ్యాదులు మూడవతెగవారు. "ప్రపంచమునందలి ప్రసిద్ధమతము లన్నియుఁగూడ న్యూనాధికభేదములతో నరులను పరమేశ్వరునికడకుఁ గొనిపోవు మార్గములే. అందొకటియు నసత్యముగాదు. కనుక నేమతమును మనము నిరసింపఁగూడదు. అవన్నియు నపవర్గసౌధమునకు ముముక్షువుల నెక్కించుటకు సాధనమైన నిచ్చెన మెట్లు. కొన్ని యడుగుమెట్లు, కొన్ని పైమెట్లు. ఏమెట్లు లేకపోయినను నిచ్చెనయొక్క సంపూర్ణతకు లోపము రాకమానదు. అద్వైతమతము పరమావధియైన పైసోపానము. అందఱును గూడ నేదో యొకజన్మమున నటకుఁ బోక మానరు. అధికారతారతమ్యము ననుసరించి మనమందఱమును అందేదో యొక మెట్టునంటి పట్టుకొనియుందుము.

కేలూఁతయిచ్చి క్రిందిమెట్లవారిని పైమెట్లకుఁ గొనిపోఁగలవాఁడు నిజమైన గురువు, సత్యసంస్కర్త. అంతేకాని సోపానచ్ఛేదముచేసి క్రిందఁ బడఁద్రోయుట సంస్కారముగాదు" అని వీరు సర్వమతసామరస్యముఁ గల్పించి యుపదేశింతురు. యథార్థమైన సంస్కర్త యెట్టివాఁడుగా నుండవల

యునో శ్రీవివేకానందస్వామి 'నాగురువుగారు-My Master' అను తనయుపన్యాసరత్నములోఁ జక్కగా విశదీకరించి నాఁడు.

మఱియు "ఈప్రపంచము నానారమ్యవృక్షసమేత మగు నొక దివ్యోద్యానము వంటిది. అందే వృక్షము లేకపోయినను ఆరామరామణీయకమునకు కొదవయే కలుగును. ఒక్కొక్కచెట్టున కొక్కొక్కవిశిష్టమనోహరలక్షణ మున్నట్లు ఒక్కొక్కసన్మతమున కొక్కొక్కప్రస్ఫుటమైన దివ్యలక్షణ ముండును. కొన్నిమతములు కర్మప్రధానములు, కొన్ని భక్తిప్రధానములు, కొన్ని జ్ఞానప్రధానములు. సర్వశక్తుఁడగు భగవంతుఁడు పక్షపాతిగాఁడు. ఒక్కొక్కజాతి కొక్కొక్కశక్తి యధికముగాఁ బ్రసాదించినాఁడు. ఆజాతివా రాశక్తి ననాయాసముగా నభివృద్ధిచేసికొని తద్విషయమున సర్వేతరప్రపంచమునకును జక్కని యుపదేష్టలు కాఁగలరు. విత్తవిభవాధికారాద్యైహికభోగముల కనువైన దేహబల బుద్ధి బలములు పాశ్చాత్యజాతుల విశిష్టలక్షణములు. బాహ్యప్రపంచవశీకరణములో, పంచభూతములను బానిసలుగాఁ జేసికొని వానిచేఁ బనిచేయించుకొని సమస్త లౌకికానందములును అనుభవించుటలో, వారికిఁ జాలిన వారితరులు లేరు. ఏతద్విషయమున వారు జగద్గురువులుగా నుండుట కర్హులు. ఇఁకఁ బ్రాచ్యులు త్యాగశీలతలో నెక్కువవారు. ఆంతరప్రపంచనిగ్రహములో, కష్టసహనములో,

మనస్సునరికట్టి యైహికానందములను దాఁటిన పారమార్థిక ప్రశాంతిసుఖ మనుభవించుటలో, నితరులు వారికి సాటి గారు. కనుక నీవిషయమున వారు జగద్గురువులుగా నుండుట కర్హులు. సుప్రసిద్ధమతస్థాపకు లందఱును బ్రాగ్దేశీయులే యగుట యీమాట సత్యమని తెల్పుచున్నది. కనుక నుభయులును అన్యోన్యసాహాయ్యము చేసికొని యెవరిలోటులు వారు దీర్చుకొని సంపూర్ణసుఖజీవనము సాగించుకొనఁ బ్రయత్నింపవలెను. ఎంతచేసినను స్వభావసిద్ధములైన జాతీయలక్షణములు మాత్రము పోఁజాలవు. కృషివలనఁ జెట్లు మంచిఫలముల నిచ్చును, కృషిలోపమువలన ఫలములు నిస్సారములై చెడిపోవును. ఒక్కభూమినుండి, యొక్కనీటినుండి, యొక్కగాలినుండి ప్రతివృక్షమును సహజముగాఁ దనకుఁ గావలయు నాహారమే గ్రహించి పెరుఁగుచున్నది. అంతేకాని, యెంత యెరువువేసి యెన్నిపాట్లు పడినను, మామిడిచెట్టు కొబ్బెరచెట్టుగాదు, కొబ్బెరచెట్టు మామిడిచెట్టుగాదు. అట్లు మాఱుట యనఁగా నొకచెట్టు నశించుట యన్నమాట. లోకోపకారార్థము భగవత్సృష్టమైన యేజాతియును ఏమతమును అట్లు పూర్తిగా నశించుట యెన్నఁటికిని తటస్థింపదు."

"కావున జాతీయప్రధానలక్షణముల నంతరింపఁజేయుఁగావించు సంస్కరణప్రయత్నములు వ్యర్థములు, హానికరములు. అట్లని యావశ్యకమైన సంస్కరణములు మానఁగూడదు. ఉచితపోషణములేని చెట్టు వాడి క్రమముగా నశించు

నట్లు, కాలానుగుణ సంస్కారములు గావించుకొనకుపేక్షించు వారిమతముకూడ నానాఁటికి క్షీణించి నశింపక మానదు. ప్రతిమతములోను సర్వజనసమ్మతములును సార్వకాలికములును శాశ్వతములును అగు ముఖ్యధర్మములు కొన్నియుండును; దేశకాలపరిస్థితులఁ బట్టి యప్పటప్పటికి మార్చుకొనవలసినట్టియు నట్లు మార్చుకొనకున్న మహానర్థకరములు కాకమాననట్టియు గౌణ ధర్మములు కొన్నియుండును. ముఖ్య ధర్మములు మాఱిన నెంత హానికలుగునో గౌణధర్మములు యథోచితముగా నెప్పటికప్పుడు మాఱకున్న నంత హానియు సంభవించును. ఏమతమైనప్పటికిని, తత్ప్రతిపాద్యమగు ననంత భగవత్తత్వమువలెనే, యపరిమితమై యభివృద్ధినొందుట కనంతమైన యవకాశము కలిగియుండును. మాకు మార్పు లక్కఱ లేదు. ఒరులనుండి మేము నేర్చుకొనవలయు విషయము లేమియు లేవు—అని చెప్పువారు ఆత్మాభివృద్ధి నరికట్టుకొని స్వవినాశకారు లగుదురు.”

ఈమూడవతెగవా రిట్టి బోధనము లనేకములు గావించి, మొదటిరెండు తెగలవారికిని సంధిచేసి, యనేకకారణములచేత నిష్టు డధోగతిపాలై యున్న మనదేశమాతను తన్మూలమున నుద్ధరింప నుద్యమింతురు.

శ్రీవివేకానందస్వామివారిపై నా కధికభక్తిగౌరవము లుండుట కింకొక హేతువు గలదు. తన గురూత్తమునకు వలెనే తనకును అద్వైతసిద్ధాంతమునం దధికాభిమాన మున్న

ను, అదియొక్కటియే యుపదేశించి యూరకుండక—ప్రకృతి నిబట్టి, వృత్తినిబట్టి, చిత్తపరిపాకమునుబట్టి, యితరస్థితిగతులనుబట్టి—యాధ్యాత్మిక ఫలప్రాప్తికై యెవఁ డెట్లు నడచుకొనవలయునో, యరఁటిపం డొలిచి చేతఁబెట్టినట్లు, చక్కఁగా స్పష్టముగా విపులముగా ఆయన యాయాపట్ల బోధించి నాఁడు. అందుచేత నితరబోధకులకంటె ఆయన మనదేశమున కెక్కువ యుపకర్తయైనాఁ డని నాయభిప్రాయము. "మతము మాటలచమత్కారములో లేదు, ఆచరణములో నున్నది, ఆచరణద్వారమునఁగాని సాక్షాత్కారఫలసిద్ధి యెవ్వఁటికిని గలుగనేరదు. పాలు పా లని యెంత యఱచినను దప్పి దీఱి సత్తువగలుగదు. అవి తెచ్చుకొని త్రాగవలెను" ఇది వారిగురువుగారి యుపదేశము. "ఐహికవిషయములందువలెనే యాముష్మిక విషయములందుఁగూడ అభిరుచులను నవియున్నవి. కోరనిది రాదు, గట్టిగాఁ గోరినది యెప్పటికైన రాకమానదు. ముముక్షువు తనయిష్టానుసారము పోవచ్చును. ఒకఫలముమీఁద నతృప్తిజనించినప్పుడే దానికధికమైన ఫలముమీఁదికి మనసుపోవును. వాంఛ కృషిప్రేరకము, కృషి ఫలాపాదకము. పరమనాస్తికుఁడు మొదలుకొని—బ్రహ్మోహమ్—అనుకొనఁదగిన పరమాద్వైత శిరోమణివఱకును ఉండు తన ముద్దుబిడ్డల నందఱను బోషించుకొనఁగల యాహారపదార్థములు శ్రుతిమాత స్తన్యములో నున్నవి. భయపడకుము, భయమే పాపమూలము, ఆత్మవిశ్వాస ధైర్యములే మన

లోపల మన కగపడకుండనుండు అనంతాఖండ దివ్యజ్యోతి స్వరూపమగు నాత్మను లేపి రేఁపి మన యభీష్టముల నెఱవేర్పఁ జాలునవి. ఆత్మవిశ్వాసము లేనివానికి భగవద్విశ్వాస మెన్నఁటికిని జనింపఁజాలదు" పిడుగులవంటి యిట్టి యుపదేశవాక్యములు శ్రీస్వామివారి యుపన్యాసములలోఁ బెక్కుపట్లఁ గాన్పించుచున్నవి.

అందుచేత శ్రీరామకృష్ణపరమహంసస్వామివారును ఆయన జ్ఞానపుత్త్రరత్నమగు శ్రీవివేకానందస్వామివారును నాకుఁ బరమపూజ్యులైనారు.

"ఈహిందూమహాత్మ్య ప్రపంచమునంతను గజగజలాడించినది" అని యెవనిఁగూర్చి డెట్రోయిట్ వార్తాపత్త్రిక వ్రాసి యద్భుతపడినదో ఆమహానుభావుఁడు మనదేశ దుర్దిష్ట వశమున నల్పాయుష్కుఁడై తరుణవయస్సులోనే పరమాత్మైక్యము నొందినాఁడు. కన్నులు మిఱుమిట్లుగొను కాంతితో గగనమందుఁ దోఁచు విద్యుల్లత నెంతకాల మాపి యుంచుకొనఁగలము? మహాపురుషు లక్లే వచ్చి తళుక్కున మెఱసి పోవుచుందురు. పోయిరని యెట్లు చెప్పగలము? అమృతత్వసిద్ధినొందినవారికి మృతి యెట్లు రాఁగలదు? వారు మృతజీవులు! మీాసమాజమువంటిసమాజము లుండునంతకాలము, శ్రీరామకృష్ణమతము లుండునంతకాలము, ఆయన బోధనముల ననుసరించి నామాంతరములతో బయలుదేఱిన, యింకను

బయలుదేఱునున్న, యితరములైన దేశసేవాసంఘము లుండు నంతకాలము, ఇంతయేల? అనశ్వరమగు మనయార్షమతము భూమిపై నుండునంతకాలము—శ్రీవివేకానందస్వామివారి పరమపవిత్రనామము విస్మృతిలోఁబడిపోదు!

మీయధ్యక్షుఁడుగారు మీకు నా "సందేశము" వ్రాసిపంపుమని నన్నడిగినారు. అల్పజ్ఞుఁడనగు నాయట్టివానిసందేశమువలన నేమి ప్రయోజనము? ఆధ్యాత్మికతేజస్సంపన్నులగు మహానుభావుల మనము గౌరవించుట యెట్లు? త్రికరణశుద్ధిగా వారుచెప్పినట్లు చేయుటవలన! అంతకంటె నవ్యాజమైన గౌరవసూచనయన్య మేదియును లేదు. అందుచేత, నిదిగో! నన్నడిగిన సందేశ మతిసంగ్రహముగా నొకవాక్యములో నిమిడ్చి వ్రాసిపంపుచున్నాను చిత్తగింపుఁడు—"నిష్పక్షపాతబుద్ధితో, నిరుపమానవక్తృతా వైదుషీ మేధానుభవసంపత్తితో, నిష్కలంకమైన దేశాభిమానముతో శ్రీస్వామివారు విరచించి ప్రకటించిన యుపన్యాసములు మరలమరలఁ బఠించి మననముచేసికొని తత్సదుపదేశములు స్వాచరణములోఁ బెట్టుకొని, మీరు తరించి ప్రస్తుత మతిదీనదశలోనున్న మీదేశము నుద్ధరింపుఁడు!" ఇదియే నాసందేశము.

ప్రస్తుతదేశదుస్థితిని, శ్రీస్వామివారి బోధనములను, జిత్తమునందుంచుకొని మఱికొన్ని మాట లాశీఃపూర్వకముగా వ్రాసి నాయీవ్యాసము ముగించుచున్నాను. అవి లేఁతవయ

సులో నుండు ఆరురుత్తులకొఱ కుద్దేశింపఁబడినవిగాని ఆరూఢులగు పెద్దలకొఱ కుద్దేశింపఁ బడలేదని విన్నవించుకొనుచున్నాను.

## 1

దేహబలబుద్ధిబలాత్మబలముల నొసఁగు విద్యయే నిజమైన విద్య యని చెప్పఁదగినది. బుద్ధిబలము మాటయెట్లున్నను ప్రస్తుతము ప్రచారములోనున్న విద్య దేహబలప్రదముగా లేదు, ఆత్మబలప్రదముగా నంతకంటె లేదు. కనుక విదేశీయవిద్యావిధానమును జాతీయలక్ష్యముల కనుకూలముగా మార్చుకొనఁ బ్రయత్నింపవలెను. మితమైన మనశ్శక్తిని అమూల్యమగు కాలమును శుష్కవిద్యాసంగ్రహణమునందు వ్యర్థపఱుపక, యుక్తమార్గముల ధనోపార్జనము చేసికొని సుఖముగా మర్యాదగా, సాధ్యమైనంత పరోపకారముగా వించుచు, జీవయాత్ర చేసికొనుట కనువైన విద్యలఁ గఱచుటలో వినియోగ పఱుపవలెను.—అనఁగా వృత్తివిద్యలు ముఖ్యముగా నేర్చుకొనవలెను.

ఆరోగ్యజీవనమున కనావశ్యకములును స్వదేశస్థులు స్వయముగాఁ జేసి యీయలేనివియును అగు ననేకభోగపదార్థములకు మన మిప్పు డలవాటుపడినాము. అందుచేఁ బ్రజల పరాధీనతయును దారిద్ర్యమును అంతకంతకు హెచ్చుచున్నవి, వంశపరంపరగా వచ్చుచున్న దేశీయవృత్తులును కళ

లును నశించుచున్నవి. ఇది యొక పెద్ద యుపద్రవము. అది జాతీయవిశిష్టలక్షణమగు ననాడంబర జీవనపద్ధతికి భంగకర మగుటయే కాక యాధ్యాత్మికాభివృద్ధినిగూడ నరికట్టుచున్నది. కనుక నీవిషయమున మనమందఱము మన నడవడిని సవరించుకొని యతి జాగరూకతతోఁ బ్రవర్తింపవలెను.

## 2

అనివార్యముగా నిత్యము మనము చేసికొను వివిధ వ్యాపారములవలన శిథిలమై జీర్ణమై పోవుచున్న శరీరభాగములు పునర్నిర్మితికై మనము తిను నాహారములో విశేషభాగ ముపయోగపడవలెను. ఇది యాహారముయొక్క ప్రధానప్రయోజనము. అట్లుపయోగపడఁగా మిగిలినయన్నసారమే ప్రజననక్రియ కుపయోగపడవలెను. ఇది సర్వజంతుసామాన్యమైన స్వాభావికధర్మము. ఆత్మవికాస మధికముగాఁ గల మానవజాతిలో నల్పసంఖ్యాకులు ఆ తేజస్సును రెండవ మార్గమునఁ బోనీయక సత్సాధనములచే శరీరమున జీర్ణము చేసికొందురు. వారే యూర్ధ్వరేతస్కు లనఁబడువారు. అట్టివారి కుద్దండదేహబల మనోబలాత్మబలము లలవడును. వారే ప్రజలను నడపి సరియైనమార్గములలోఁ బెట్టుట కర్హులైనవారు. ఈవిషయమునుగూర్చి గాంధిమహాత్ముఁడు తన 'ఆత్మసంయమము, అమితవిషయాసక్తి — Self-restraint versus Self-Indulgence" అను గ్రంథములో విపుల

ముగాఁ జర్చించి వ్రాసినాఁడు. యువజనులెల్ల రది చదువు కొని తదనుసారముగాఁ బ్రవర్తించిన దేశ మచిరకాలములో మహోన్నతదశకు రాఁగలదు. శ్రీవివేకానందస్వామివారి చివరదశలో "తమరీ క్రొత్తగాపునర్ముద్రితమైన ఎన్సైక్లోపీడియా బ్రిటానికా—Encyclopaedia Britannica——యింత శీఘ్రకాలములో నింత సవిమర్శముగా నెట్లు చదువఁ గలిగినారు?" అని యొకరు పృచ్ఛింపఁగా "నాయనా! బ్రహ్మచర్యమున కసాధ్యమగు పని యేమున్నది?" అని స్వామి వారు ప్రత్యుత్తర మిచ్చినారఁట. బ్రహ్మచర్యప్రభావ మెట్టిదో వారిజీవితమువలననే మీరు కనుఁగొనఁగలరు.

మనదేశము బాగుపడవలెనన్న, నకలంకబ్రహ్మచారులును బ్రహ్మచారిణులును, పరిశుద్ధప్రవర్తనులగు సన్యాసులును సన్యాసినులును, బెక్కురు గావలయును. పాశ్చాత్యులలో నెంతమంది సత్పురుషులును సద్వనితామణులును అవివాహితులై యుండి యెట్టి లోకోపకారకృత్యములు చేయుచున్నారో పరికించి చూచుకొనుఁడు.

స్థితిగతు లట్లుండవలసియుండఁగా మనదేశ మెట్లున్నదో చూడుఁడు. వివాహ మవశ్య కర్తవ్యమైనది. పుట్టినది మొదలు గిట్టువఱకుఁ బురుషునకు వివాహచింతదక్క నన్య మేదియు లేదు. నిశ్చింతులై సోల్లాసహృదయులై విద్యాభ్యాసము చేయుచు క్రీడావినోదములతో శరీరమునకును మన

స్సునకును పుష్టికలిగించుకొని భావిజీవయాత్ర సుకరముగా సుఖకరముగాఁ జేసికొనవలయు పసిపిల్లలకు వివాహముచేసి యకాలగార్హస్థ్యశృంఖలలు దగిల్చి వారిని జెప్పరాని కష్టముల పాలుచేయుచున్నాము. మనదేశానర్థములలోఁ బెక్కింటికి అతిబాల్యవివాహములే మూలకారణములు. ఈదురాచారము దేశమునుండి తొలఁగించిన, అవాంఛనీయములగు కొన్ని ప్రస్తుతసంస్కారముల యావశ్యకత తగ్గించిన వారమగుదుము. తీవ్రవిద్యాభిలాష భక్తివైరాగ్యాదులు, అప్రతిహతమైన లోకోపకారతత్పరత[1], అంగవైకల్యము, దుర్వ్యాధిపీడ, అర్థలోపము [2] —ఇట్టి గుణదోషములుగల వారిని బెండ్లాడుఁడని నిర్బంధించుట కాని పని యని సాహసించి చెప్పవచ్చును.

## 3

దాన ముత్తమోత్తమమైన ధర్మము. అన్నదానమువలనఁ దాత్కాలికసంతృప్తి గలుగును. అర్థదానమువలనఁ గలుగు సంతుష్టి యంతకంటెఁ జిరస్థాయి. ఐహికవిద్యాదానమువలన ధన యశస్సముపార్జనసామర్థ్యము కలుగునుగాన, నది యంతకంటెను ఎక్కువది. సర్వదుఃఖవిమోచనకారియు నిరవధికబ్రహ్మానందదాయియు నగు తాత్త్వికవిద్యాదానము సర్వోత్కృష్టమైనది. ఈతారతమ్యములు మనసులోఁ బెట్టు

1—ఈ మూడును గుణములు

2—ఈ మూడును దోషములు.

కొని దానరూపమున శక్తి వంచనలేకుండ మన మితరులకు సాహాయ్యముచేయుచుండవలెను.

నిమ్నజాతులకు మేలుచేయుట కమోఘమైన సాధనము విద్యాదానము. వారిని విద్యావంతులఁ జేసినచో వారికిఁ గావలయు సదర్థములన్నియు వారే సంపాదించుకొనఁగలరు. వారి కేమికావలయునో మనము నిర్ణయించిపెట్ట నక్కఱ లేదు.

అతి దరిద్రదశలోనున్న పామరజనులలోని యజ్ఞానాంధకారము విరియఁగొట్టఁజాలిన విద్యాదీపమువారికడకే కొనిపోవలయును. సంసారలాంపట్యములేని సన్యాసులే యందుల కర్హులైనవారు—అని స్వామివారు 'అమెరికానుండి శ్రీమైసూరుమహారాజువారికి వ్రాసిన లేఖలోఁ జెప్పినారు. సన్యాసుల కవకాశ మెక్కువగా నుండు నని వా రట్లు సెలవిచ్చినారు గాని, యిట్టివిషయములందు గృహస్థులు తటస్థులుగా నుండవలయు నని వారి యభిప్రాయముగాదు.

సన్యాసులఁబోషించుభారము గృహస్థులదే. దీనరక్షణ స్త్రీ విద్యాపోషణసంబంధములైన సర్వసత్కృతులకును ధనాదిరూపసాహాయ్యముచేయుట గృహస్థాశ్రమములో నుండు నెల్లరకును విధియై యున్నది.

## 4

ముక్తిప్రాపణసాధనములగు యోగము, కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము—వీని కన్నిటికిఁ గూడ నీతి

యత్యావశ్యకము. అది లేనిచో నేయోగమును ఫలకారి కానేరదు. యోగమునకు యమనియమము లావశ్యకములు. కర్మయోగమునకు పంచమహాయజ్ఞరూపములైన పరోపకార కృత్యము లావశ్యకములు. భక్తియోగమునకు—సత్యము, ఆర్జవము, దయ, దానము, అహింస, అనభిధ్య *—అను నాలుకల్యాణగుణములు నావశ్యకములు. జ్ఞానయోగమున కావశ్యకమగు సాధనచతుష్టయములో శమదమాదిషట్క సంపత్తియొకటి. అనఁగా నన్నియోగములకు నీతి పునాది యన్నమాట, నీతిలేని యోగాభ్యాసము లన్నియు నిరుప యోగము లన్నమాట. కనుక మిత్రులారా! మన మందఱము నీతిని పరిపుష్టము చేసికొనవలయును. అన్యాపేక్ష లేకుండ నడచియే క్రమక్రమముగా మనలఁ బైమెట్టులకుఁ గొనిపోఁ గలదు. యోగాభ్యాసమునకు మాత్రము సద్గురుసాహాయ్య మత్యావశ్యకము. అది లేకున్న, మేలునకు మాఱు కీడు సంప్రాప్తము కావచ్చును.

ఫలకామి కాకుండఁ బరోపకారాదిసత్కర్మము లాచరించుట కర్మయోగము యొక్క పరమావధి.

సమస్తజీవరాసులను భ్రాతృభావముతో సంపూర్ణప్రేమతోఁ జూచుకొనుట భక్తియోగముయొక్క పరమావధి.

సర్వము తానే యను అభేదభావముతోఁ బ్రవర్తించుట జ్ఞానయోగము యొక్క పరమావధి.

---

*(అనభిధ్య=విత్తాదుల నుగూర్చి యనుచితముగా చింతింపకుండుట)

అన్నియు మనల నేకగమ్యస్థానమునకే కొనిపోవును. అన్నిటికిని స్వార్థత్యాగ మావశ్యకము. "గోధుమగింజ భూమిలోఁబడి నశించినఁగాని సస్యఫలప్రాప్తి కాఁజాలదు" అని మహానుభావుఁడు బైబిల్లులో చెప్పినాఁడు. అహంపదార్థము నశించినకొలఁదిని లోనియాత్మతేజస్సు అభివ్యక్తమగును— ఇట్టి సదుపదేశములు శ్రీవివేకానందస్వామివారు తమకర్మయోగోపన్యాసములందును ఇతరత్రకూడ సుబోధముగాఁ జేసినారు.

ఇవియే నేఁజెప్పఁదలఁచుకొన్న మాటలు. భగవత్కృపచే, శ్రీవివేకానందస్వామివారి యాశీఃప్రభావముచే, మీసమాజముయొక్క సత్ప్రయోజనము లన్నియుఁ జక్కఁగా నిర్విఘ్నముగా నెఱవేఱుఁగాక! మీ వివేకానందసమాజము అత్యంతలోకోపకారకమైన సమాజమై యుత్తరోత్తరాభివృద్ధి నొందుచుండుఁగాక!

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు!

శ్రీరామచంద్రా.

శ్రీరామచంద్ర.

హిందూజాతీయాదర్శములఁగూర్చి

# శ్రీవివేకానందస్వామివారు

చేసిన బోధనములు.

## నీదేశమునకు శూరులు కావలయును; శూరులుకండు.

## 1

త్యాగము, పరోపకారము—ఇవి హిందూజాతి యొక్క పరమపురుషార్థములు. దేశములో ఆధర్మములను బలపఱుచుకొనుఁడు. తక్కినవి వానియంత నవియే వచ్చును.

## 2

పురుషులు—ఉత్సాహవంతులును, నిష్కపటులును, ఆస్తికులును, అగు తరుణవయస్కులు—కావలయును. వీ రున్నచో తక్కినదంతయును సర్వసన్నద్ధమై యుండును. అట్టి మార్గురుదొరకిన, ప్రపంచమంతయు పూర్తిగా మార్పుచెందఁ గలదు.

## 3

బిడ్డలారా! కొంచె మోరిమిఁదెచ్చుకొనుఁడు....... అభ్యాసబలముచే నది యద్భుతముగా నభివృద్ధి నొందును.

వసత్కార్యఫలసిద్ధికైనను, తత్పూర్వము అనేకకష్టములు పడక తప్పదు. పట్టుదలతో పనిచేయువారికి ఇప్పుడో అప్పుడో ఎప్పుడో తేజోవర్షనము గాక మానదు.

4

సత్సంకల్పసిద్ధికి అనంతక్షమ, అనంతమైన పరిశుద్ధత, అనంతమైన యభినివేశము—ఇవి యమోఘసాధనములు. ఈరహస్యమును దెలిసికొనుఁడు.

5

"నేను నాయకుఁడను" అని చెప్పుకొని ఘుంటజికి వచ్చితివేని, నీకు సహాయులుగా నెవరును రారు. నీవు విజయివి కావలయునన్న మొట్టమొదట అహంభావమును జంపుకొనుము.

6

మీమనస్సులను మనోరథములను బ్రహ్మాండమంత విపులముగాఁ జేసికొనుఁడు.

7

హృదయమందు గాఢమయిన అనుకంప గల్గియుండుము. నీకు నిజముగా భ్రాతృదయగలదా? అయ్యో! దేవతలయొక్కయు, ఋషులయొక్కయు, సంతతివారలు, కోట్లకొలఁది జనులు పశుప్రాయు లయినారని నీవు జాలిఁపడుచున్నావా? అనంత

పంక్షాగులకు జనులుతిండిలేక చిరకాలమునుండి మలమల మాడుచున్నారని నీవుదుఃఖించుచున్నావా? దేశము అజ్ఞాన గాఢతమో మేఘావృతమయి యున్నదని నీవు విలపించున్నావా? ఇదంతయు నిన్ను బాధించి యస్వస్థచిత్తుని చేయుచున్నదా?

## 8

నీతోడి జనులను నీవు ప్రేమించుచున్నావా? భగవంతునికై వెదకుచు నీవెచ్చటికిని బోనక్కఱలేదు. దరిద్రులు, దుఃఖార్తులు, దుర్బలులు—వీరందఱు భగవంతులు గారా? నీకు ప్రేమయున్నదా? ఉన్నచో నీవు సర్వశక్తుండవే. నీవు స్వహితపరతాలవవిరహితుఁడవయి యున్నావా? ఉన్నచో నీవప్రతిహతశక్తియుక్తుఁడవన్నమాటయే ఎచ్చటనైనను శీలమే ఫలకారి, ప్రేమ యెప్పుడును విఫలముగాదు, అది యమోఘము. సత్యము జయమందక తప్పదు.

## 9

నాబిడ్డా! పట్టువిడువక పనిచేయుము. సాహాయ్యముకై వీరిపైని వారిపైనిఆశ పెట్టుకొనియుండకుము. యావన్మానవసాహాయ్యముకంటెను భగవత్సాహాయ్య మెంతో బలవత్తరమయినదిగాదా? పవిత్రుఁడవై...... పరమేశ్వరుని నమ్ముకొనియుండుము; సదా ఆయననే ఆధారము చేసికొని యుండుము; అట్లుండుచో, నీవు ఋజుమార్గవర్తివై యుం

దవు; నీకంటె బలవత్తరమయి నిన్ను నిర్జించునదేదియూ నుండఁజాలదు.

## 10

సర్వేశ్వరునకు జయమగుఁగాక! ముందటికి సాగి పొమ్ము; మహాప్రభువు మన సేనానాయకుఁడు. యుద్ధములో ఎవరు పడిపోయినారో కనుఁగొనుటకయి వెనుకకుఁదిరిగి చూడకుము. ముందటికి త్రోసికొనిపొమ్ము. సోదరులారా! ఇట్లే మనము సాగిపోదము. ఒకఁడుపడిపోయిన, నింకొకఁడు వానిపనిఁ గైకొని దాని నిర్వహించును.

## 11

అతిప్రధానమైనది వైరాగ్యము, త్యాగము—వైరాగ్యవిహీనుఁడు లోకసేవకై తనహృదయమునంతను అర్పింపఁజాలఁడు. త్యాగి అందఱను సమదృష్టితోచూచి తానందఱ సేవకై ఆత్మార్పణము చేసికొనును.

## 12

భారతదేశీయుఁడా! నీదేశస్త్రీజనసంఘమున కంతకును సీతాసావిత్రీదమయంతులు ఒజ్జబంతు లన్నమాట మఱవకుము; నీవారాధించుదేవుఁడు యోగులలో మహాయోగియును, ఉమాపతియును, సర్వసంగపరిత్యాగియును అగు శంకరుఁ డన్నమాట మఱవకుము. నీవివాహమును, నీవిత్త

మును, నీజీవనమును, నీవిషయానందమునకుఁ గాని, నీపృథక్తత్వ సుఖమునకుఁగాని, ఉద్దేశింపఁబడ లేదన్నమాట మఱవకుము; జగజ్జనని పీఠముకడ నిన్ను బలిగానర్పించుకొనుటకే నీవుజనించితి వన్నమాట మఱవకుము; నీసంఘుజీవనపు టేర్పాటు, అనంతమయి సర్వగతమయి యున్నమాతృత్వము యొక్క ప్రతిరూప మన్నమాట మఱవకుము; నిమ్నజాతులు, విద్యావిహీనులు, మూఢులు, దరిద్రులు, చెప్పులుకుట్టు మాదిగలు, వీథులు దుడుచు పాకీలు—అందఱు, నీరక్తసంబంధులును నీసోదరులును అనుమాట మఱవకుము.

శూరుఁడా! ధైర్యసాహసములతో, మహాభిమానముతో "నేను హైందవుఁడను, ప్రతిహైందవుఁడు నాసోదరుఁడు—మూఢహైందవుఁడు, బ్రాహ్మణుఁడైన హైందవుఁడు, మాలహైందవుఁడు—వీరందఱును నాసోదరులే" అని యఱచి చెప్పుము. నీవుకూడ మొల నొక చింపిపాఁత చుట్టుకొని చిత్తోత్సేకముతో ఇట్లు ఉచ్చైస్స్వరముతో ప్రకటించుచు పలుకుము:—

"హైందవుఁడు నాసోదరుఁడు, నాప్రాణతుల్యుఁడు, హిందూదేశపు స్త్రీపురుష దేవతలందఱును నా భగవంతులే, హిందూజనసంఘము శైశవములో నే శయనించిన యుయ్యాలతొట్టి, యౌవనములో నే విహరించిన యుద్యానవనము, వార్ధకమందు నాకు వారాణసీక్షేత్రము, నాపవిత్రస్వర్గము."

సోదరా! "భారతభూమియే నాపరమమోక్షానందపదము, హిందూదేశక్షేమమే నాక్షేమము" అని చెప్పుచు, "ఓగౌరీనాథా! ఓజగజ్జననీ! నాకు పౌరుషము ప్రసాదింపుము, శక్తిస్వరూపమగు నోజగన్మాతా! నాదౌర్బల్యమును, నాభీరుత్వమును తొలఁగించి, నన్ను వీరపురుషునిగాఁ జేయుము" అని జపించుచు అహోరాత్రములు అవిచ్ఛిన్నముగా ప్రార్థించుకొనుము.

## 13

మీరు నిజముగా నాబిడ్డలే యగునెడల, దేనికిని భయపడరు. ఎట్టి అడ్డంకులకును అఁగిపోరు. మీరు సింహసదృశులయి యుందురు. పరుండి నిద్రపోవుచుండిన హిందూదేశమును మనము ప్రబోధింపవలెను.



చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1930.

# ఆంధ్రసేవాప్రసూనములు

—— సిద్ధముగనున్నవి. ——

అ

1. ఆత్మజ్యోతి (మానవసేవయే మాధవసేవ.) 2వ కూ. 8
2. శుభోదయము (చూరంటుకొన్నపుడే అగ్గియారుపవలె) 3
3. ప్రేమాంజలి (సుగుణసంపదగల పంచమదంపతుల సుందరచరిత్ర.) 2వ కూర్పు. 5
4. సుగుణాకరము (పై మూడుకథలును కలిసి) 14
5. జన్మభూమి (కరుణరసభరితమగు నవ్యనాటిక.) 4
6. శ్రీవివేకానందసందేశము. 2

—— సిద్ధమగుచున్నవి. ——

1. దొంగలముఠా (ఉత్తేజకమగు సాంఘికనాటకము.)
2. రూపకకుసుమావళి (బాలచంద్రులకు ప్రదర్శనత్రయము)
3. కావ్యసింధువు (నరునకు వలయు ధరణి పరిమితి.)
4. విజయకవచము (శాంతమే భూషణము.)
5. పరమపదము (శ్రీరామతీర్థుని దివ్యోపన్యాసము.)
6. చిత్తరంజని (మనోహర కథల సంపుటి.)
7. గౌరాంగచరిత్ర (మృదుమధురవచోరచితగద్యకృతి.)
8. సుమనోభిరామము (ఖండకావ్యములసంపుటి.)

## — వ్యాసకుటీరము —

వేలుపాకపోస్టు-ఎలమంచిలి దరి-[విశాఖపట్నము జిల్లా.]